# జాన్ కాల్విన్

## జీవిత చరిత్ర



# జాన్ కాల్విన్



A Gospelfamily Product




గాస్పెల్ IND ఫ్యామిలీ

www.gospelfamily.in

# జాన్ కాల్విన్

క్రీ॥శ॥ 1509 చిన్న ఫ్రెంచ్ టౌన్ అయిన నోయన్‌లో జాన్ కాల్విన్ జన్మించెను ఆయన తల్లిదండ్రులు విశిష్టమైనవారు మరియు ఆయన తండ్రి నోటరీగా పనిచేసేవాడు. యౌవనస్థుడైన జాన్ చక్కగా పెంచబడెను. ధనికులు మరియు ముఖ్యమైన ప్రజలమధ్యన ఎలా ప్రవర్తించాలో ఆయనకు నేర్పింపబడెను. చిన్న పిల్లవాడుగా ఉన్నప్పుడు నేర్చుకొన్న విషయములు తన జీవితములో చక్రవర్తులను, యువరాజులను ఎదుర్కొన్నపుడు సహాయపడెను.

ప్రారంభములోనే వారి కేమారుడైన జాన్ చాలా తెలివైనవాడని మరియు ఎంతో అమోఘమైన జ్ఞాపక శక్తి గలవాడని అతని తల్లిదండ్రులు గుర్తించిరి. ఆయన పద్నాలుగేండ్ల వయసు గలవాడైనా ప్యారిస్‌లోని గ్రామర్ స్కూల్‌కు వెళ్ళెను. అక్కడ ఆయన హీబ్రూ మరియు గ్రీకు భాషలను నేర్చుకొనెను. ఈ భాషలలోనే బైబిల్ ప్రధానముగా వ్రాయబడెను. ఆయన లాటిన్ భాష కూడా నేర్చుకొనెను. ఈ భాషను సంఘపితరులు (చర్చ్ ఫాదర్స్)

వాడిరి మరియు పరిశోధనా, విద్యాభ్యాసములలో కూడా దీనిని వాడిరి. యౌవనుడైన జాన్ తనంతట తాను బైబిల్ చదవటం ప్రారంభించెను. బైబిల్‌తోపాటు అగస్టీన్ రచనలను కూడా చదివి ఆనందింప ప్రారంభించెను. కొద్ది సంవత్సరముల పిమ్మట ఆయన విశ్వ విద్యాలయమునకు వెళ్ళెను, అక్కడ ఆయన చాలా కష్టపడి చదువగా తన ఆరోగ్యము క్షీణింప నారంభించెను.

ప్యారిస్ నగరములో ఫ్రాన్స్ యందంతట పట్టణముల లోనూ గ్రామములలోనూ బైబిల్ పఠనము నిమిత్తము గుంపులుగా కూడుకొనేవారు. ఈ గుంపులో వారి స్వంతభాషలలో క్రొత్త నిబంధనను చదివేవారు. (క్రొత్త నిబంధన అదివరకే ఫ్రెంచ్ భాషలోనికి అనువదింప బడెను.) సాధ్యమైనంత త్వరగా ఆ లేఖన పఠనమును ఆపివేయాలని పోప్ తలంచెను. లేనిచో జర్మన్‌లో సంఘ సంస్కరణ ఉద్యమము ప్రారంభమైనట్లు ఫ్రాన్స్‌లో కూడా ప్రారంభమగునని భయపడెను. వెంటనే సైనికులు ప్యారిస్‌లో ప్రవేశించి 'దుర్బోధకుల' నిమిత్తమై వెదక నారంభించిరి. (బైబిల్ చదువువారిని ఈ పేరుతో పిలిచి

అపహాసించేవారు) ఎందుకంటే తమ దేశములో రోమన్ క్యాథలిక్ మతము మాత్రమే తమ దేశములో రోమన్ క్యాథలిక్ మతము మాత్రమే ఉండవలెనని ఫ్రెంచ్‌రాజు కోరుకొనెను. దుర్బోధకులు తమ సంబంధమైన న్యాయస్థానము ద్వారా తీర్పు తీర్చబడుదురు (ఇంక్విజిషన్). జాన్ కాల్విన్ ఇలాంటి బైబిల్ పఠన గుంపులో చేరెను. వారి కూడికలలో ఎంతో సమర్థవంతముగా బైబిల్‌ను వివరించెను. ఆయన విద్యావంతుడు గనుక రోమన్ క్యాథలిక్ సంఘమందలి తప్పిదములను పసిగట్టెను. రక్షణ మార్గము బయలుపరచుమని కాల్విన్ ప్రార్ధనలో దేవునితో పోరాడెను. ప్రభువు కాల్విన్ ప్రార్థన ఆలకించెను. కాల్విన్ హృదయములో దేవుని వాక్యపు వెలుగు ప్రకాశించెను. **క్రీస్తునందలి ప్రాయశ్చిత్తము ద్వారా మాత్రమే పాపి రక్షింపబడును! కృప ద్వారా మాత్రమే పాపి రక్షింపబడును!** దేవుని వాక్యమందు పరిశుద్ధ లేఖనములు దీనినే బోధించుచున్నవి. కాల్విన్ కూడా దీనినే బోధించును. "ఆకస్మిక మార్పుద్వారా దేవుడు నా హృదయమును లోబరచుకొని దానిని విధేయతగల

దానినిగా చేసెను." అని జాన్ కాల్విన్ చెప్పెను. అప్పటినుండి దేవునికి విధేయుడైన సేవకునిగానుండ గోరెను. ఆ విధముగా తన మరణము వరకు అలాగే ఉండిపోయెను. అన్నిటికంటే ముఖ్యముగా ప్రజలకు దేవుని వాక్యమును గూర్చి వివరించి దాని అర్థమును చెప్పుటకు కాల్విన్ ఇష్టపడేవాడు.

నగరములో మొదటి హతసాక్షి నగరములో దహించివేయబడు సమయమది. ఆయన ఓ వైద్యుడు. వారి ప్రార్థనల ఫలితముగా మరియు గాక ప్రభువైన యేసు స్వస్థపరచునని ఆయన తన పేషంట్లకు చెప్పెను. ఈ వాఖ్య తన ప్రాణమును బలిగొనెను. ఆయన గమనిస్తూ నుండొనియుండగా, యౌవనుడైన కాల్విన్ తన పిడికిలి బిగించెను. ఆయన మిత్రులు ఆయనను పట్టుకొనిరి... లేనిచో వారి చుట్టమును తన చేతిలోనికి తీసికొనియుండేవాడు. ప్యారిస్‌లోని విశ్వవిద్యాలయములో పండితుడైన ప్రొఫెసర్ కాప్ వైస్ చాన్స్‌లర్‌గా పనిచేయుచుండెను. ఒక దినాన విశ్వవిద్యాలయములో ఉపన్యాసమిచ్చెను. ఆయన శ్రోతలలో ప్రొఫెసర్స్ క్యాథలిక్ మత గురువులు మరియు సన్యాసులునూ ఉండిరి.

అకస్మాత్తుగా అంతయూ నిశబ్దమాయెను. ప్రొఫెసర్ చెప్పునదేమిటంటే.. క్రీస్తు కార్యము ద్వారా మాత్రమే పాపులు రక్షింపబడుదురు. ఇది దుర్బోధ అని రోమన్ క్యాథలిక్‌లు ఒకరితో ఒకరు చెప్పుకొనిరి. రోమన్ క్యాథలిక్ మతన్యాయస్థానము చర్యతీసికోనున్నందున కాప్ పారిపోవలసి వచ్చెను. వారు కాల్విన్ వెంట కూడ ఏరిడి. కాప్ ఇచ్చిన ఉపన్యాసము కాల్విన్ రచనలలోని దేనిని రోమన్ క్యాథలిక్‌లు కనుగొనిరి. కాల్విన్‌ను బంధించుటకై ఓ సాయంత్రమున సైనికులు క్యాల్విన్ ఇంటికి వెళ్ళిరి. వారు వచ్చి తలుపులు బాదుతుండగా క్యాల్విన్ మేడ గదిపైనుండెను. త్వరగా కొన్ని పేపర్లను కట్టగట్టుకొని బాల్కని గుండా ఇంటి వెనుకనుండి పారిపోయి తన శత్రువునుండి తప్పించుకొనెను. తెల్లవారు జాముననే ద్రాక్షాతోటలో పనిచేయువ్యక్తివలె వస్త్రము ధరించుకుని నగరమునుండి పారిపోయెను. ఇరవై నాలుగేండ్ల వయసుగల కాల్విన్ ఇప్పుడు తన స్వంత ఇల్లు లేక తప్పించుకుని తిరుగువానిగా మారెను.

దక్షిణమందు ఫ్రెంచ్‌లోని ఓ చిన్న పట్టణము చేరుకునేంతవరకు అది తన స్నేహితుని నివాస స్థలము.

తన స్నేహితుడైన డుట్విల్వెల్లెట్ ఆ పట్టణమునకు మత గురువుగానుండెను. ఆయన కూడా బైబిల్ చదివి సంఘమందలి అనేక తప్పిదములను గ్రహించెను. కాల్విన్‌తో మాట్లాడుటకు ఆయన చాలా సంతోషించెను. తన హృదయమందు ఆయన ఇక రోమన్ క్యాథలిక్‌గా లేడు. ప్రతిరోజు కాల్విన్ ప్రసంగములను వ్రాయగా వాటిని ఆ పట్టణ ప్రజలకు చదివి వినిపించేవాడు. ప్రతిదినము బైబిల్‌ను ఉపయోగించి పట్టణ ప్రజలకు దేవుని గూర్చి బోధించేవాడు. ఆయన బోధవినుటకు సమీప గ్రామములు మరియు పట్టణములనుండి అనేకులు వచ్చేవారు.

దేవుని వాక్యము విత్తబడెను. అది ఫలముకాచేలా దేవుడే చూచుకొనును.

## పలాయనుడైన కాల్విన్

కాల్విన్ కష్టపడేవాడు. అంత ఎక్కువగా తినేవాడు, నిద్రించేవాడు కాదు. ఆయన లెక్చరర్‌గా ఉపన్యాసము లివ్వటము మాత్రమే గాక రాత్రింబగళ్ళు ఓ గ్రంథమును

వ్రాస్తుండేవాడు. ఈ గ్రంథములో అసలు క్రైస్తవము అంటే ఏమిటో వివరించెను. ప్రజలకు బోధ అవసరము, ప్రజలకు క్రైస్తవ సిద్ధాంతమును గూర్చి చాలా తక్కువ అవగాహన ఉన్నదని ఆయన గ్రహించెను. అందుకే ఆయన ఈ గ్రంథమునకు క్రైస్తవ మత బోధ అని పేరు పెట్టెను. దానికి ఇన్‌స్టిట్యూట్స్ అను అసాధారణ పేరునూ కలదు. ఈ గ్రంథమందు నిజ మతమును గూర్చిన ప్రతి విషయమును కూడా ఆయన వ్రాసెను. బైబిల్‌లో ప్రత్యక్షపరచబడిన విధముగా ఆయన దేవుని గూర్చి వ్రాసెను. అద్భుతమైన సృష్టి కార్యమును గూర్చి మరియు మానవుని ఘోర పతనమును గూర్చి వ్రాసెను. ప్రభువైన యేసు క్రీస్తు మరియు ఆయన కార్యమును గూర్చి వ్రాసెను. పాపుల హృదయములలో పరిశుద్ధాత్ముడు జరిగించు, తిరిగి జన్మించుట, విశ్వాసము, పశ్చాత్తాప పడుట అను కార్యములను గూర్చి వ్రాసెను. ఆయన ధర్మశాస్త్రము, ప్రార్ధన, సంఘము నకివ్వబడిన ఆజ్ఞలను గూర్చి వ్రాసెను. వాస్తవమునకు బైబిల్‌లో కనబడు ఈ సత్యములను అనగా క్రైస్తవ బోధలోని ఆయా సంగతులను

గూర్చి వ్రాసెను. కాల్విన్ క్రైస్తవ విశ్వాసమును సమర్ధించు సమర్థ వాదకుడు. ఆయన గ్రంథములో రోమన్ క్యాథలిక్ సంఘము యొక్క తప్పిదములను తెలిపెను. ప్రజలింకెంత మాత్రమును మోసగింపబడకుండా వారికి ఈ సంగతులు అవసరము. బైబిల్‌లో వ్రాయబడిన సంగతులనే వారు నమ్మవలెను.

ఇక్కడ ఈ చిన్ని పట్టణములో ఈ ప్రాముఖ్య గ్రంథమును ఆయన వ్రాయనారంభించెను. తరువాత ఆయన మరొక స్థలమునకు వెళ్ళినప్పుడు కూడా ఈ గ్రంథమును వ్రాయుట కొనసాగించెను. ఆ గ్రంథము మూడు సంపుటములుగా వ్రాయబడెను. **కాల్విన్ దానిని లాటిన్ భాషలో వ్రాసి ఫ్రెంచ్ భాషలోనికి దానిని అనువదించెను. ఇట్టి ముఖ్య గ్రంథమును వ్రాయుటకు కాల్విన్‌కు జ్ఞానమిచ్చినవాడు ప్రభువే.** మనము ఆ గ్రంథమును చదివినట్లయితే, కాల్విన్ దేవునికి మహిమనిచ్చుటకు ఎంత ఆశ గలిగియుండెనో మనము గ్రహింతుము. ప్రభువగు దేవుని పవిత్రత మరియు ఆయన వాక్య పవిత్రత వల్ల కాల్విన్ ఎంత గౌరవము

కలిగియుండెనో ఆ గ్రంథమందు మనము గమనించ వచ్చును. సంఘ సంస్కరణోద్యమ వెలుగు తేజోవంతముగా, బలముగా ప్రకాశించుచున్నది! కాల్విన్ గ్రంథమును చదివిన వేలమందికి అది దీవెనకరముగా నుండెను. ఈ ప్రజలు రోమ్ యొక్క అబద్ధపు బోధను విడిచి, తన వాక్యమందు బయటపరచబడిన విధముగా ప్రభువు భయమును గూర్చి నేర్చుకొనిరి.

నేటివరకునూ కాల్విన్ యొక్క గ్రంథము ఎక్కువగా చదువబడుతున్నది. రిఫాన్డ్ డాగ్మాటిక్ థియాలజిలో కాల్విన్ గ్రంథము, సరియైన గ్రంథముగా ఎంచబడెను గనుక విద్యార్థులు మరియు బోధకులు దానిని చదువుతున్నారు.

('డాగ్మాటిక్' క్రైస్తవ బోధకు సంబంధించినది) మార్టిన్ లూథర్ ఇన్స్టిట్యూట్ అను గ్రంథమును చదివినపుడు 'ఈయన (కాల్విన్) ఓ మహోత్తరబుద్ధి గలవాడు' అని చెప్పెను.

మత సంబంధ న్యాయస్థానము కాల్విన్ ఎక్కడ ఉన్నది కనుగొనెను. తగిన సమయములో కాల్విన్ మరియు తన స్నేహితుడు తప్పించుకొని పోయిరి. వారు కొంత కాలయు గుహలలో దాగుకొనవలసి వచ్చెను. చాలా ప్రయాణము చేసి (ఆ సమయములో వారు ప్యారిస్‌కు కూడా వెళ్ళిరి) కాల్విన్ మరియు ఆయన స్నేహితుడు తుదకు బాస్లె అను నగరమునకు చేరుకొనిరి. వారు ప్రయాణిస్తూ మార్గమధ్యమున గ్రామములలో మరియు కోటలలోనూ బోధించిరి. కాల్విన్ స్విస్ నగరమైన బాస్లెలో ఉంటుండగా కొంతకాలము నెమ్మదిని, శాంతిని అనుభవించెను. ఈ నగరములోనికి మత సంబంధ న్యాయస్థానమువారు అనుమతింపబడనందున కాల్విన్ ఏ విధమైన ఆటంకము లేకుండా తన గ్రంథమైన 'ఇన్‌స్టిట్యూట్స్' పనిని కొనసాగించవచ్చును. ఏది ఏమైనా, కాల్విన్‌కు ఫెరారలోని డచ్ రాణి నుండి ఆహ్వానము అందినందున కాల్విన్ ఉత్తర ఇటలీకి వెళ్ళెను. ఓ ఫ్రెంచ్ స్త్రీ బైబిల్ కథలను ఫ్రెంచ్ రాజు యొక్క వదినగారికి చెప్పగా ప్రభువు ఆవిడ నేత్రములను తెరువగా రోమన్

క్యాథలిక్ సంఘ దోషములను గ్రహించెను. అప్పుడు ఆమె ప్రొటెస్టెంట్ రాణిగా మారెను. ఆమె కాల్విన్‌ను చూచుటకు చాలా ఆనందపడెను. ప్రొటెస్టెంట్ కాందిశీకులు ఆ రాజభవనములో చేరియుండగా అందు ఓ పెద్ద గదిలో కాల్విన్ బోధించుటకు ఆవిడ అనుమతినిచ్చెను.

ఇటలీలో మత సంబంధ న్యాయస్థానమువారు కాల్విన్ కొరకై వెదుకుచున్నారని వినినప్పుడు ఆయన గుఱ్ఱమునెక్కి అక్కడనుండి వెళ్ళిపోయెను. ఆయన ఎట్టి ఆటంకము లేక 'ఇన్‌స్టిట్యూట్స్' అను గ్రంథ రచన కొనసాగించుటకై స్ట్రాస్‌బర్గ్ వెళ్ళుటకు ఆయన కోరుకొనెను. స్ట్రాస్‌బర్గ్ ప్రయాణము చాలా దూరము గనుక జెనీవాలో అనగా ఓ చక్కటి సరస్సు తీరాన ఉన్న స్విట్జర్లాండ్‌కు వచ్చి ఆ రాత్రి గడిపెను. మరుసటి రోజున తెల్లవారుజామున తన ప్రయాణమును కొనసాగించెను. ఈ ప్రణాళిక ప్రభువు చిత్తమా...?

జెనీవాలో కాల్విన్ ఆ రాత్రి గడుపుటకై ఓ సత్రము కొరకై వెదకెను. ఆ నగరములో ప్రొటెస్టెంట్‌లు

నివశింతురు. జెనీవాలో మత సంబంధ న్యాయస్థానము వారు హాని చేయరు గనుక వారు అక్కడికి పారిపోయి వచ్చిరి. హాని చేయుటకు అక్కడి వారికి అనుమతి లేదు. జెనీవా క్రమేపి ఓ ప్రొటెస్టెంట్ నగరముగా తయారయ్యెను. కొన్ని సంవత్సరముల ముందే ఫారెల్ అను బోధకుడు అక్కడికి వచ్చి యుండెను. ప్రభువు ఆయన పరిచర్యను ఎంతగా దీవించెనంటే అనేకులు రోమన్ క్యాథలిక్ సంఘమును విడిచి ప్రొటెస్టెంట్‌లుగా మారిరి. అయిననూ జెనీవాలో ఫారెల్‌ను బాధించే సంగతులు కొన్ని కొనసాగుతున్నాయి. చాలా మంది జూదమాడుదురు, శపించుట, ఒట్టు పెట్టుకొనుట అక్కడ జరిగేది. కొన్ని సార్లు తమ భార్యలను విడిచి మరొక స్త్రీలతో వెళ్ళేవారు. ఫారెల్ ఇట్టి వాటికై పోరాడెను గాని తనకు ఒక్కనికే పనంతయూ వీలుపడలేదు. సహాయకుని కొరకై ఆయన ప్రభువు నడిగెను.

## జెనీవాలో కాల్విన్

కాల్విన్ జెనీవాలో ఆ రాత్రి గడుపుచున్నాడని ఫేరెల్ వినెను. ఫేరెల్ ఇన్‌స్టిట్యూట్స్ అను గ్రంథమును చదివి

"జెనీవాలో కావలసిన వ్యక్తి కాల్విన్" అని భావించెను. ఆ సాయంత్రం కాల్విన్ ఉండు సత్రమునకు ఫేరెల్ వెళ్ళెను. కొద్ది నిమిషముల తరువాత ఫేరెల్ కాల్విన్ గదిలో ప్రవేశించెను. తెరువబడిన కిటికీనొద్ద కాల్విన్ పుస్తకము చదువుతుండగా ఫేరెల్‌ను చూచి ఆశ్చర్యపోయెను. ఫేరెల్ వెంటనే విషయానికొచ్చి 'మీరు రేపు వెళ్ళనైయున్నారా'? నేను అలా జరుగనివ్వను! ఇక్కడ జెనీవాలో చేయుటకు చాలా పనియున్నది అనెను.

"నాకు ఎటువంటి ఆటంకము లేక కొనసాగి వారు వలెను గనుక నేను రేపు స్ట్రాస్‌బర్గ్ వెళ్ళనైయున్నాను నేను ప్రారంభించుటకై ఆరాటపడుచున్నాను" అని కాల్విన్ బదులిచ్చెను. 'కుదరదు, ఆక్కడ చాలా మంది పాప సంబంధ జీవితము జీవిస్తున్నారు. వారికి దేవుని వాక్యమునకు అనుగుణముగా జీవించుట అంటే ఏమిటో నేర్పింపబడవలెను' అని ఫేరెల్ అనెను. కాని కాల్విన్ దానికి నిరాకరించెను. తాను తన రచనను కొనసాగించుటకై నెమ్మదిని, ప్రశాంతతను కోరుకొనెను.

'నీకు నెమ్మది, ప్రశాంతత కావాలా, దేవుని సేవకులకు మరణము మాత్రమే ప్రశాంతతనిచ్చును' అని భావోద్వేగముతో అరచెను. అయిననూ కాల్విన్ ఒప్పుకోలేదు. ఫేరెల్ ఇంకా తీవ్రముగా మాట్లాడుతూ 'నన్నొక్కడినే ఇక్కడ పోరాటము చేయమంటావా' అనెను. ఆయన కాల్విన్‌ను తన భుజము తట్టి 'నీ నెమ్మది మరియు ప్రశాంతతను దేవుడు శపించును, నేనీసంగతిని దేవుని నామమున చెప్పుచున్నాను' అనెను. "క్రీస్తు కంటే నిన్ను గూర్చి నీవు అధిక శ్రద్ధ కలిగియున్నావని" అని ఫేరెల్ అనెను. మాట్లాడునది ఫేరెల్‌గా కాదు, నేను ప్రభువు స్వరము వింటున్నానని కాల్విన్ భావించెను. కాల్విన్ కళ్ళలో కన్నీళ్ళు తిరుగగా, నేను జెనీవాలో ఉండిపోతాను. నేను ప్రభువునకు విధేయుడనవుతాను అనెను. కాల్విన్ జెనీవాలోని పెద్ద సంఘములో ఆదివారమునాడే గాక, వారము పొడుగున బోధించుచుండెను. ఆయన ప్రసంగములను వినుటకు అనేకులు వచ్చిరి. ఆయన బైబిల్‌ను చక్కగా వివరించును! ఇట్టి బోధ వీరికి చాలా అవసరము. వారు చాలాకాలము రోమన్ క్యాథలిక్‌లుగా

ఉంటూ బైబిల్‌ను గూర్చి తప్పుడు అభిప్రాయములను కలిగియున్నారు. ఆ నగరములో జీవించు వారి జీవిత శైలికి విరోధముగా ఫేరెల్ మరియు కాల్విన్ కలసి పోరాడిరి. జెనీవా సభ వారి పనిని ప్రోత్సహించెను. ప్రజలకుపయోగపడు చట్టములు జారీ చేమబడెను. వాటిని ఉల్లంఘించినవారు శిక్షింపబడిరి. తమంతట తాము విషయములను నిర్ణయించుకొనువారు స్వతంత్రులు (లిబర్టిన్స్) అని పిలువబడిరి. చట్టములు చాలా కఠినముగానున్నందున ప్రజలు వాటిని తీవ్రముగా ఎదిరించిరి. ఈ చట్టములు దుర్వినియోగము చేయబడెను గనుక ఆ చట్టము విషయమై ఫేరెల్ మరియు కాల్విన్‌లు బాధ్యులుగా ఎంచబడిరి. వారు బెదిరింపబడిరి. మధ్యరాత్రి వరకునూ వీధులలో చాలా అల్లరి చెలరేగెను. ఫేరెల్ మరియు కాల్విన్‌లను అపహసిస్తూ పాటలు పాడెను మరియు వారిని భయపెడుతూ కరపత్రములు ముద్రింపబడెను.

మొదట జెనీవా సభ తీవ్రముగా స్పందించెను. అలజడి కలుగజేసినవారు చెఱసాలలో వేయబడిరి. కానీ

తరువాత సభ పట్టించుకోవటం తగ్గించెను, తిరుగుబాటు దారులు వారి అల్లరిని కొనసాగించిరి. "కొన్నిసార్లు జెనీవా నగర ప్రజలు ఆకలిగొన్న తోడేళ్ళవలె నుందురు" అని సత్రములో కాల్విన్‌తో ఫేరెల్ చెప్పిన సంగతులు ఇప్పుడు నిజమౌతున్నవి. దేవుని పనిని పాడుచేయుటకు సాతానుడు ప్రతిరోజు విషమ ప్రయత్నము చేస్తున్నట్లు కాల్విన్ మరియు ఫేరెల్ గ్రహించిరి.

పునరుత్థాన ఆదివారము ఉదయించెను. జెనీవా సభ ప్రకారము నేడు ప్రభురాత్రి భోజనము జరుపబడాలి. నగరములో చాలా లౌకికత్వము, అల్లరి ఉండెను గనుక అది ఆచరింపబడుటకు కాల్విన్ మరియు ఫేరెల్ సమ్మతింపలేదు. ప్రభురాత్రి భోజనము పవిత్రమైనది గనుక అది అపవిత్ర వాతావరణము మధ్యన ఆచరింప బడకూడదు. శనివారము రాత్రి కాల్విన్ శత్రువులు ఆయన ఇంటికి వెళ్ళి ఆయనను బెదిరించిరి. మూసివున్న కిటికీలపై రాళ్ళు విసిరిరి. 'ఈ మోసగాణ్ని నదిలో పారవేయండి' అని వారు కేకలు వేసిరి. పిస్టల్ చప్పుళ్ళు కూడా వినబడెను. తత్ఫలితముగా కాల్విన్ రాత్రంతయూ

నిద్రలేక యుండెను. మరుసటి ఉదయము ప్రభువునందు బలవంతుడై యుంటూనే, శారీరకముగా అలసి, పాలిపోయిన కళ్ళతోనే వేదికపై బోధించుటకు వెళ్ళెను. ప్రభురాత్రి భోజనము ఎందుకు ఆచరింపబడకూడదో వివరించినప్పుడు ఎంతో నిశ్శబ్దము నెలకొనెను. ఆయన కఠన పలుకులు ప్రజలను చాలా ప్రభావితము చేసెను. సంఘములో ఆయన శత్రువులు సహితము మౌనులైరి.

ఏది ఏమైనా ఇదే మధ్యాహ్నము మరొక సంఘములో బోధించుటకు వెళ్ళెను. ఆయన స్నేహితులు దాడి చేయువారినుండి కాపాడవలసి వచ్చెను. జరిగిన దానిని జెనీవా సభ వినినపుడు ఆ అల్లరి విషయమై కాల్విన్ మరియు ఫేరెల్‌ను నిందించిరి. మూడు రోజులలోగా వారు నగరమును విడిచి వెళ్ళాలని సభ ఆజ్ఞాపించెను. వారు నేరస్థులవలె వారిని దేశ బహిష్కరణ చేసిరి. వారితో పాటు మరొక సేవకుడు కలిసి ముగ్గురు బాస్లె నగరమునకు నడిచి వెళ్ళిరి. నాలుగు మాసముల పిమ్మట కాల్విన్ స్ట్రాస్‌బర్గ్ వెళ్ళెను. వారి ఇండ్లనుండి పారిపోయి వచ్చినవారు అ నగరములో ఓ ప్రొటెస్టెంట్ సమాజము

పోగై కూడుకునేవారు. ఈ కాందీశీకులకు సహాయము చేయుటలో, స్ట్రాస్‌బర్గ్ సంఘసంస్కరణ ఉద్యమకారుడైన బూసర్‌కు సహాయకుడవసరమాయెను. మొదట బూసర్‌కు సహాయము చేయుటకు కాల్విన్‌కు ఇష్టము లేకుండెను కాని బూసర్ కాల్విన్‌ను 'స్ట్రాస్‌బర్గ్‌కు రమ్ము! ఇక్కడ చేయవలసిన పని చాలా ఉన్నది. వేరే మార్గమున వెళ్ళిన యోనా వలె ఉండవద్దు! కాని తరువాత ప్రభువాయనను నీ-నెవెకు తిరిగి పంపెను!

## కాల్విన్ తిరిగి జెనీవాకు వచ్చెను

కాల్విన్ స్ట్రాస్‌బర్గ్‌లో కష్టించి పని చేసెను. ఆయన అనేక ప్రసంగములు చేసి విద్యార్థులను పరిచర్యకై తర్ఫీదు చేసెను మరియు బైబిల్ అర్థమును వివరించుటకై పుస్తకములను వ్రాసెను. సంఘకూడికలలో, ఆరాధనలలో పాడుకొనుటకైఆయన కీర్తనలను వచనములలోనికి మార్చెను. స్ట్రాస్‌బర్గ్‌లో కాల్విన్ ఇడెలెట్ వాన్ బురిన్‌ను వివాహమాడెను. ఆమె విధవరాలుగా ఉండి ఇద్దరు పిల్లలను కలిగియుండెను. ఆమె నెదర్లాండ్సు నందు

జన్మించెను. మతహింసను తప్పించుకొనుటకై వారిరువురు స్ట్రాస్‌బర్గ్‌నకు పారిపోయిరి. స్ట్రాస్‌బర్గ్‌లోనే తన భర్త చనిపోయెను. ఇడెలెట్ కాల్విన్‌కు చాలా సహాయకరముగా నుండెను. ఆయన అనారోగ్యముతోనున్నప్పుడు ఆవిడ ఆయనను చక్కగా చూచుకొనెను. ఆయన తరచుగా వేదనలో ఉండేవాడు. ఆ వేదననుండి నివారణ కలుగ జేయుటకు ఆవిడ ప్రయత్నించేది. ఆయన కృంగిన వేళలో ఆవిడ ఆయనకు ప్రభువును ఆయన బలమైన, విశ్వశనీయమైన యజమాని జ్ఞాపకము చేసేది. జెనీవా నుండి ఒక ఉత్తరము వచ్చెను. అది సుదీర్ఘ ఉత్తరమై యుండి ఓ ముఖ్యమైన కార్డినల్‌చే వ్రాయబడెను. ఆయన ఓ ఉత్తరమందు నగరము మరొక్కమారు రోమన్ క్యాథలిక్ నగరముగా మారునట్లుగా పురిగొల్పెను. ఫారెల్ మరియు కాల్విన్ నగరమును పెడత్రోవపట్టించి జెనీవా ప్రజలను మోసగించిరని ఆ ఉత్తరములో ఆయన పేర్కొనెను. ఆ ఉత్తరమునకు ఎవరు జవాబీయగలరు? కాల్విన్ తప్పక వ్రాయగలుగును. కానీ మూడేండ్ల క్రితము నగరము

నుంచి ఆయనను తరిమి వేసినందుకు వారు భాద్యులు కారా? జరిగిన సంగతి ఎలా ఉన్నా వారు స్ట్రాస్‌బర్గ్‌కు వర్తమానకుని పంపిరి. వెంటనే కాల్విన్ కార్డినల్ ఉత్తరమునకు జవాబు వ్రాయదలచెను. తిరిగి జెనీవా రోమన్ క్యాథలిక్ నగరముగా మారితే అది విచారకరముగా నుండదా? జెనీవా నగరమునకు మరియు కార్డినల్‌కు వ్రాసిన ఉత్తరము సుదీర్ఘమైనది. బైబిల్‌ను సూచిస్తూ వాస్తవమునకు ప్రజలు రోమన్ క్యాథలిక్ సంఘము ద్వారా మోసపోయిరని కాల్విన్ ఆ ఉత్తరమందు తెలిపెను. వ్రాయుటకు ఆరు రోజులు పట్టిన ఆ ఉత్తరము ప్రొటెస్టెంట్ విశ్వాసమును ఋజువుపరచెను. అది చదివి కార్డినల్‌కు ఏమి చెప్పాలో అర్థము కాలేదు.

తిరిగి జెనీవాలో ఇబ్బంది వచ్చెను. నగరములో అల్లరి చెలరేగెను. ఆ పరిస్థితి సహకరించుటకు చాలా కష్టమైనది అని జెనీవా సభ భావించెను. మత గురువులు కూడా నగర ప్రజలను నిమ్మళపరచలేకపోయిరి. మరొకసారి 'కాల్విన్ దయచేసి మాకు సహాయము చేయుము' అని

సందేశము పంపబడెను. మొదట కాల్విన్ నిరాకరించెను. జెనీవాలోని అనేక మంది స్నేహితుల నుండి మరియు ఫేరల్ నుండి (ఆ సమయములో ఫేరల్ మరొక పట్టణమునందుండెను) అనేక ఉత్తరములు అందుకున్నాక కాల్విన్ తిరస్కరించలేకపోయెను. ఇది ప్రభువు చిత్తము...! 1541లో కాల్విన్ జెనీవాకు తిరిగి వచ్చి అక్కడ అరవై అయిదు సంవత్సరములకు పైబడి జీవించెను! మొట్టమొదట జెనీవా సభ సహాయముతో సంఘ జీవితమును నియంత్రించు నియమములను ప్రవేశ పెట్టెను. సంఘములో సరియైన నియమనిబంధనలు చాలా అవసరము. తయారు చేయబడిన నియమములను ప్రజలు అనుసరించునట్లుగా పెద్దలు మరియు పరిచారకులు చూచుకొనవలెను. నియమములను గమనింపనివారిని హెచ్చరింపవలెను. ఈ విధానమును క్లరికల్ క్రమశిక్షణ అని పిలువబడెను. నియమము లన్నియూ సమ్మతింపబడ్డాక, అవన్నియూ సంఘమందు చదువబడెను. ప్రజలు మేము వాటికి లోబడుదుమని వాగ్ధానము చేసిరి. కాల్విన్ నగరమునకు తిరిగి వచ్చాక

మొదట ప్రసంగములో అంతయూ చాలా నిశబ్దముగా నుండెను. మూడు సంవత్సరములు ఆయన నగరము నుండి బహిష్కరింపబడ్డాక ఆయన ఏమనును? కాల్విన్ మూడేండ్ల క్రితము ఎక్కడైతే తన ప్రసంగము ఆపివేసెనో అక్కడనుండి కొనసాగించెను. ఈ నగరమునకు ఎన్నడు రాలేదేమో అన్న విధముగా ఆయన గత సమస్యలను ప్రస్తావించనే లేదు. వారి దుష్ ప్రవర్తన యంతటిని ఆయన క్షమించెను. వారి తప్పిదములకు అతీతముగా, క్రమేపి తన గొఱ్ఱెలను ప్రేమించే నిజమైన కాపరి కాల్విన్.

కాల్విన్ చాలా కష్టపడి పని చేసెను. ఆయన అనేక ప్రసంగములను బోధించిన యౌవనులకు మరియు పెద్దలకు సత్యోపదేశ తరగతులను నిర్వహించెను. ఆయన మత గురువుతకు ఉపన్యాసములిచ్చెను. రోగులను దర్శించెను. సలహా కోరినవారికి అనేక ఉత్తరముల ద్వారా సలహాలు వ్రాసి పంపెను. ఐరోపాయంతటి నుండి రాజులు మరియు చక్రవర్తులు సహా ప్రశ్నలను, సందేశములను పంపెడివారు. ఆయన ఇంకనూ పుస్తకములు వ్రాసి దాదాపు బైబిల్‌లోని పుస్తకము

లన్నింటిపై వ్యాఖ్యానము వ్రాసెను. ఆయన ఎప్పుడు కూడాను తన రచనలను రాత్రి సమయమందు చేసెడివారు. బైబిల్ వ్యాఖ్యానము నేటివరకును, ఇన్‌స్టిట్యూట్స్‌వలె వాడబడుతున్నది. ప్రొటస్టాంటిజమ్ తన బోధలలో ఎందుకు కాల్వినిస్టిక్‌గానున్నదో మనము కారణమును గ్రహింపవచ్చును. (జర్మని, ఉత్తర ఐరోపా దేశములలో బోధల విషయములో వారు లూథరన్‌లుగా మిగిలిపోయిరి.) కాల్విన్ దంపతులకు ఒక కుమారుడు పుట్టెను గాని, చిరుప్రాయమందే అతడు మరణించెను. ఆయన భార్య చనిపోయినప్పుడు కాల్విన్ చాలా విచారపడెను. కాని ఓ ఆదరణకర సంగతి ఏదనగా ఇడెలెట్ ప్రభువుతోనున్నది. నగరములో పరిస్థితి గతములో ఉన్నంత దుర్భరముగా లేకపోయినా లిబర్టిన్స్ (స్వతంత్రవాదుల) విషయమై కాల్విన్ చాలా బాధపడెను. ఆయన ఎదురుగానే తన పేరు పెట్టి పిలిచేవారు. పిల్లలు ఆయనను కెయిన్ అని హేళన చేసెడివారు.

ఒక ఆదివారము నాడు కాల్విన్ ప్రభురాత్రి భోజనమును జరిపెను. కొందరు (లిబర్టిన్స్) స్వతంత్ర

వాదులు అందులో పాల్గొనదలచిరి. కాల్విన్‌కు వారి పాప సంబంధ జీవితమంతయు తెలియును. రొట్టె మరియు ద్రాక్షారసముపై తన చేతులుంచి వారినుండి వాటిని కాపాడు ఉద్దేశ్యముతో కళ్ళలో మంటలు, సెగలు క్రక్కుతూ 'మీరు నా చేతులు నరికి వేసినా సరే ఈ పవిత్ర భోజనము మీకందింపను' అని అరచెను. లిబర్టిన్స్ (స్వతంత్ర వాదులు) బల్లను సమీపించుటకు సాహసించలేదు.

## కాల్విన్ మరియు సర్వేటస్, కాల్విన్ మరణము

ఒక దినాన సర్వేటస్ అనే వ్యక్తి జెనీవాకు వెళ్ళెను. ఇరవై యేండ్ల క్రితం కాల్విన్ ఆయనను కలిసియుండెను. సర్వేటస్ బోధ దోషపూరితమైనదని కాల్విన్ గ్రహించెను. యేసు దేవుని నిత్యకుమారుడు కాడు అని సర్వేటస్ చెప్పేవాడు. ఆయన త్రిత్వ సిద్ధాంతమును ఒప్పుకోలేదు. సర్వేటస్ దుర్భోధకుడైయుండి, తన రచనల ద్వారా ప్రజలను, ప్రొటెస్టంట్‌లను సహా పెడత్రోవ పట్టించే ప్రయత్నము చేసెను. జనీవాలో సంఘసంస్కరణోధ్యమము

ముప్పునకు లోనగుతున్నట్లు కాల్విన్ గ్రహించెను. దేవుని నామము దూషింపబడుచున్నందున కాల్విన్ ఈ విషయమై శ్రద్ధ చూపెను. సర్వేటస్ న్యాయస్థానము ఎదుట హాజరు పరచబడినప్పుడు తన దోషమును ఒప్పుకొనుటకు నిరాకరించెను. ఆయన కాల్విన్‌ను అబద్ధకుడని మరియు నేరస్థుడని చెప్పెను. ఈ సమస్యను ఎలా పరిష్కరించాలి? జెనీవా సభ సమీప సేవకులను, ఫేరెల్‌ను ఈ విషయమై సలహా అడిగెను. సర్వేటస్ తన దేవదూషణాభరిత బోధలను వెనక్కి తీసికోనట్లయితే మరణశిక్ష విధింపవలెనని అందరు సమ్మతించిరి. కాల్విన్ ఈ తీర్పును గూర్చి వినినప్పుడు చెఱసాలలో ఉన్న సర్వేటస్‌ను దర్శించెను. తన పాపాత్మకమైన దోషములను ఒప్పుకోమని కాల్విన్ బ్రతిమాలెను. కానీ ఆయన అంగీకరించలేదు. కాల్విన్ సర్వేటస్‌కు అధిక సహాయము చేయలేక ఆయన నిమిత్తమై ప్రార్థించెను. దుర్బోధకుడైన సర్వేటస్‌ను నగరమునకు వెలుపల కొండమీద కొయ్యమ్రానుపై వ్రేలాడ దీయబడి దహింపబడెను.

జెనీవాలో సంఘసంస్కరణోద్యమము ఆగిపోకుండా ప్రభువు చూచుకొనెను. తరువాత సర్వెటస్ దహింపబడుటకు కాల్వినే కారణమని కాల్విన్ నిందింపబడెను కాని అది వాస్తవము కాదు. వాస్తవానికి సర్వెటస్‌ను మరొక విధానములో శిక్షించుమని కాల్విన్ జెనీవా సభను కోరెను. కాని సభ దానికి ఒప్పుకొనలేదు.

జెనీవాలో అంతయూ సవ్యముగానుండెను. దాదాపు ప్రతిరోజు, కాందిశీకులు నగరమునకు వచ్చుచున్నందున క్రొత్త సంఘ భవనములు కట్టబడవలసివచ్చెను. జెనీవాలో ఉన్న కాందీశీకులు సంఘమునకు వెళ్ళుటకు అనుమతించబడిరి. యౌవనస్థులు పరిచర్యకొరకై అధ్యయనం చేసి సిద్ధపడులాగున అకాడమి లేదా విశ్వవిద్యాలయము స్థాపించబడెను. కాల్విన్ స్నేహితుడైన బేజ అకాడమికి డైరెక్టర్‌గా నియమించబడెను. ఆయన పండితుడైన క్రైస్తవుడు.

కాల్విన్ మరియు ఇతర ప్రొఫెసర్ల ఆధ్వర్యములో అధ్యయనము చేయుటకు ప్రపంచ నలుమూలల నుండి

విద్యార్థులు జెనీవాకు వస్తారు. వారు వారి చదువులను ముగించుకున్న తువాత వారి సొంత ప్రాంతములలో దేవుని వాక్యం బోధించు సేవకులుగా వెళ్ళిరి. కాల్విన్ మరణ సమయములో పదిహేనువందల మంది విద్యార్థులు అకాడమిలో చదువుతుండేవారు. ప్రభువు తన రాజ్యమును వ్యాపింపజేయుటలో జెనీవా నగరము ప్రముఖ పాత్ర వహించెను. కాల్విన్ తన ప్రసంగములను మరియు బోధను మానివేయవలసివచ్చెను. తనకు బలము లేనందునకొనసాగించలేదు. తీవ్రమైన జ్వరము ఆయనను బలహీనపరచెను. ఆయన ఇంటివద్దనే ఉండవలసివచ్చెను కాని తాను చేయగలిగినంతమట్టుకు తన రచనలను కొనసాగించెను. **నేను మరణించినప్పుడు మెలకువగా మరియు చురుగ్గా పనిచేయు సేవకునివలె ప్రభువు నన్ను చూడాలని, 'మరణించాలని' ఆయన ఆశపడెను.**

ఆదివారమున ప్రభురాత్రి భోజనము ఆచరించుటకై ఆయన మిత్రులు ఆయనను మోసుకొనిపోవలసి వచ్చెను. పాస్టర్ బేజా ఆయనకు రొట్టె, ద్రాక్షారసము అందించెను.

వణుకుతున్న స్వరముతో సంఘమంతటితో కలిసి 'ప్రభువా **నీ వాక్యముచొప్పున నీ దాసుని సమాధానముతో మరణింపనిమ్ము' అని పాడెను.**

కొన్ని దినముల పిమ్మట జెనీవా సభలోని కొందరు ముఖ్య సభ్యులు కాల్విన్ ఇంటికి వచ్చిరి. వారు ఆయనకు వీడ్కోలు పలుకుటకు వచ్చిరి. ఆయన తన బలహీన హస్తములతో వారిని దీవించెను. ఇతర సేవకులు కూడా ఆయనను దర్శించిరి. ఇప్పుడు ఫేరెల్ కూడా ఎనభై యేండ్ల వయస్సుగలవాడాయెను. ఒక సాయంత్రమున బేజా కాల్విన్ ప్రక్కకు పిలువబడెను. కాల్విన్ మరణిస్తున్నాడు కాని ఆలస్యముగా వచ్చెను ఈ లోపు కాల్విన్ మరణించెను. ఈ నమ్మకమైన దేవుని సేవకుడు నిత్యత్వమందు తన రాజును స్తుతిస్తూ సమాధానముగా జీవించును. కాల్విన్ దేవుని యొద్దనుండుటకై వెళ్ళెనని జెనీవా సభ వ్రాసెను.

కాల్విన్ జీవితము మండుచున్న క్రొవ్వొత్తివలె ఉండెను. క్రొవ్వొత్తి చివరివరకు కూడా కాలి వెలుగునిచ్చును. కాల్విన్ వెలుగుచున్న క్రొవ్వొత్తివలె తన దేహమందు

అలసిపోయిననూ కాలుతూనే ఆయన ద్వారా దేవుని వాక్యము ప్రకాశించెను. కాల్విన్ మరణవార్త వినినప్పుడు జెనీవాలో మరియు ఇతర స్థలములోనూ ప్రజలు ఎంతో విలపించిరి. ఆయన సమాధి చెంతన ఎటువంటి ఉపన్యాసములీయబడలేదు. ఆయన ఖచ్చితముగా ఎక్కడ సమాధి చేయబడెనో ఎవరికి తెలియకుండులాగున, సమాధి అని గుర్తించులాగున ఆ సమాధిపై రాయిని ఉంచలేదు. ఇదంతయూ కాల్విన్ కోరికమేరకే జరిగింపబడెను. అలా కానిచో ఆయనకు అధిక మహిమా ప్రభావమును ఆరోపింతురేమోయని ఆయన భయపడెను. **కాల్విన్ యేకైక కోరిక ఏమనగా తన దేవుని ఘనపరచి మహిమపరచుటయే.** కాని ప్రభువు కాల్విన్ పేరుగాని, ఆయన రచనలుగాని మరువబడకుండ చేసెను. నేటి వరకునూ ప్రజలు ఆయన పుస్తకములను చదువుతున్నారు అవి వేల ప్రజలకు ప్రపంచవ్యాప్తంగా దీవెనకరముగా నున్నవి. నేటికిని అది అలాగేయున్నది. ఇది ప్రభువు కార్యము గనుక ఆపబడజాలదు.

